## వచనగ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవి జీవితములు | 3 | 8 |
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీశతఘంటము వేంకటరంగశాస్త్రిగారిది | 6 | 8 |
| డిటో 3 వాల్యములు | 7 | 0 |
| ద్వాదశోపనిషత్తులు, సంస్కృతమునకు సరియైన తెలుఁగువచనము | 3 | 0 |
| భోజునికథలు | 0 | 8 |
| విక్రమార్కునికథలు | 0 | 8 |
| మర్యాదరామన్నకథలు | 0 | 2 |
| రేచుక్కపగటిచుక్క కథలు | 0 | 3 |
| పరిహాసవినోదకథలు | 0 | 12 |
| ప్రాచీనదేశచరిత్రలు | 1 | 12 |
| పతివ్రతలచరిత్ర | 1 | 8 |
| వీరాంగనలు | 0 | 12 |
| బేతాళునికథలు | 0 | 8 |
| పరమానందశిష్యులకథ | 0 | 8 |
| వైద్యులకథలు | 0 | 4 |

శ్రీరస్తు.

# నారదపురూరవస్సంవాదము.

వేదాంతతత్త్వనిరూపణము.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే.

ప్రకటితము.

1929.

శ్రీరస్తు.

# నారదపురూరవస్సంవాదము

## పురూరవుపాలికి నారదుండు వచ్చుట.

సీ. లాంఛనంబు సముజ్జ్వలధ్వజాంతరస్థిత
మహతిరూపంబున మహిమ వహింప
నవ్యగానంబు విష్ణునామాంకమధురగాం
ధర్వరూపంబునఁ గానకలిత్తెఁ
జంద్రికల్లధవళాచ్ఛకీర్తికారిక
కాంతిరూపంబునఁ గ్రమ్మికొనఁగఁ
జల్లదనంబు శశ్వద్భవాసనహార్ద్ర
దృష్టిరూపంబున దేటపడఁగ
తే. మనుమఁడయిన పురూరవఃక్ష్మాతలేంద్రుఁ
జూడ నేతెంచు చంద్రునిజాడ దోఁప
నరుగుదెంచె నభోమార్గయానమునను
నారదుండు మూర్తిజితశరన్నీరదుండు 1
తే. స్వాంతములు పల్లవించెను సత్కదంబ
ములకుఁ బంకజాతంబుల పొంక మెడసె
భువనము సుఖోదయస్ఫూర్తిఁ బొలుపు మిగిలె
నారదాగమమున కది నైజమకద. 2

వ. ఇవ్విధంబున. 3

ఉ. వచ్చిన జూచి లేచి పరివారముతో నెదురేఁగి
యవ్విభుం, డచ్చపుభక్తి మ్రొక్కి కనకాసనసుస్థి
తుఁజేసి పూజల, న్నెచ్చొదవింపఁగా వినయమేదు
రమంజులవాక్యవైభవం, బెచ్చ ననేకభంగుల
మునీంద్రుఁడు దీవనలిచ్చి వెండియున్: 4

క. కుశలంబె మీకు హితులకుఁ
గుశలమె కుశలంబె బంధుకోటికినెల్లం
గుశలమె భృత్యశ్రేణికిఁ
గుశలంబె ధరిత్రిప్రజలకున్మనుజేంద్రా. 5

వ. అని పలికిన నాసంయమీంద్రచంద్రునితోఁ జంద్ర
వంశతిలకుఁడు వినయసంభ్రమమాధురీధురీణవచ
నంబుల నల్లన నిట్లనియె. 6

క. మీకారుణ్యమువలనను
మాకందఱకున్ శుభంబు మౌనీశ్వర మీ
రాకవలన మద్భాగ్యము
లోకస్తుతమయ్యె జగతిలోపల నింకన్. 7

తే. విను తపోగుణవార్ధివై వెలయునీవు
మిత్రరూపంబుతో వచ్చి మేలొసంగ
నిపుడుగద యబ్జకులమున కెలమి యగుట
చక్రవర్తిత్వ మిఁకఁగదా స్పష్టమగుట. 8

క. అని పలుకుచున్నరేంద్రుని
వినయోక్తుల కలరి మానివిభుఁడు తదీయా
ననమున గారుణ్యరసం
బెనయఁ గటాక్షములు నిగుడ నిట్లని పలికెన్. 9

సీ. ఉత్తమాన్వయమున నుదయంబునొందుట
  సరిలేనిసౌందర్యశాలియగుట
యఱువదినాల్గువిద్యలఁ బ్రవీణుండౌట
  పటుతరభాగ్యసంపన్నుఁడగుట
ధరణిచక్రాచలాంతంబుగా నేలుట
  నిగ్రహానుగ్రహనిపుణుఁడగుట
వేదశాస్త్రోక్తసద్విధు లాచరించుట
  యౌదార్యగుణముచే నధికుఁడగుట

తే. హరిసురబ్రాహ్మణార్చనానిరతుఁడగుట
యాత్మవిదుఁడౌట యొక్కరియందుఁ గలదె
పుణ్యనిధివైన నీయందె పొసఁగెనిన్ని
సద్గుణములు పురాతనసార్వభౌమ. 10

క. స్తుత్యుం డమరులకైనను
నిత్యోన్నతుఁడయిన ధారుణీపతి 'రాజా
ప్రత్యక్షదైవత'మ్మన
సత్యవ్రత పూర్వవచనసంగతి వినవే 11

వ. అనిపలికి వెండియు నమ్మహానుభావుఁ డమ్మానవ
పతితో రాజనీతిప్రసంగంబున నిట్లనియె. 12

## రాజనీతి ప్రసంగంబునఁ బురూరవుని నారదుండు పొగడుట.

చ. మతియుతబుద్ధిశాలిఁ బరమర్మవిభేదనదక్షు సత్క్రి
యా,చతురుని శాంతునిన్ సమయసాహసుఁ గార్య
విచారకౌశలుం, బరహితశీలు షడ్గుణవిభాసురు
భృత్యజనప్రియామనో, హితనిజవర్తనున్ స్వసుమతీ
శుఁడు మంత్రిగఁ జేయఁగాఁదగున్. 13

క. తానెంత యధికుఁడయినం
గానీ మనుజేశ్వరుండు కార్యాకార్య
జ్ఞానము నిజప్రధానుల
తో నాలోచించి యుక్తితో నెఱుఁగఁదగున్. 14

క. సప్తాంగరక్షణంబును
సప్తోపాయము లొనర్పు సామర్థ్యంబున్
సప్తవ్యసనవిరక్తియు
సప్తద్వీపేంద్ర రాజసద్ధర్మంబుల్. 15

సీ. న్యాయంబుదప్పని నడవడితోడను
బెంపుగాఁ బ్రజలఁ బాలింపవలయు
నుచితవ్యయంబు సేయుచు విత్తసంపదల్
కొదవగాకుండంగఁ గూర్పవలయు
శౌర్యోజ్జ్వలములైన చతురంగబలములఁ
నెంతయు విరివిగా నేలవలయు

సమయంబు బలము విచారించి పైకొని
పరరాజ్య మాక్రమింపంగవలయు.

తే. నేమఱుటలేక గడిదుర్గసీమలందు
నాప్తులును గార్యశస్త్రప్రయత్నపరులు
నయినవారలఁ బనిససైన్యములతోడ
నునుపవలయును దనపేర్మి యొరులు వొగడ. 16

క. తన రాజ్య మొరుల రాజ్యం
బనవలవదు బుద్ధికుశలు లగువారలఁ బం
చి నిఖలవార్తలు నిచ్చలు
వినుచుండ్పును భూవిభుండు విశ్రుతమతియై. 17

క. బలవంతులతోఁ బగయును
బలవద్బాంధవులతోడి పగయును ధరలోఁ
బలువురతోఁ బగయును మఱి
బలభేదికినయినఁ దెచ్చు భంగము తలఁపన్. 18

క. చెలిమియ యుచితం బెంతయు
బలవంతునితోడ నతం డు పగవాఁడయినం
జెలిమింప కంటకం బగు
బలవంతుని చెలిమివదపి పగయూగదగున్. 19

చ. నిజభుజశక్తినైన దన నేర్పున దంత్రమొనర్చియైన
నక్కజముగ వారిపైఁ బలము గల్గినవారలఁ
గూర్చి యైన వైరిజనవినాశనంబు నొనరింపక

వ. అని మఱియుఁ బ్రసంగోచితంబు లగువిశేషభాష
ణంబుల నభివర్ణించుమునిపుంగవుం గనుంగొని
వినయవినమ్రవదనకమలుండగుచు మహీవల్లభుం
డిట్లనియె. 25

## శ్రీరాఘవుఁడు తనవైరాగ్యమును బ్రశంసించుట.

ఉ. ఎందఱు రాజు లీయవని యేలినవారిక నేల
నున్నవా, రెందఱు లెక్కసేయఁదరమే పరమే
ష్ఠికైన నట్టినే, వందఱిలోన నొక్కరుఁడనై ధర
యేలుట యెంతప్రాభవం, బిందుల కింతపెద్దగ
మునీశ్వర నన్గణియింప నేటికిన్. 26

ఉ. దేహము వాయుసంచలితదీపిక పుత్రకళత్రమిత్ర
సందోహము స్వప్నకాలమునఁ దోఁచెడిసంపద
రాజ్యభోగసన్నాహము జంత్రపుంబ్రతిమనా
ట్యము సంపద యింద్రజాలమిఁక, నైహికసౌఖ్య
మేమి సుఖముంచుఁ దలంచెదవయ్య నారదా. 27

సీ. కామరోషాదిదుష్కరశత్రువర్గప్ర
ఘాతప్రధానసాధనము ధనము
జన్మపరంపరాసంపాదితానేక
ఘనకర్మజాలవర్ధనము ధనము
కైవల్యసంప్రాప్తికారణవైరాగ్య
ధర్మమార్గావరోధనము ధనము

సకలావగుణపుంజసంశ్రయాకారరూప
దారుణనిగళబంధనము ధనము
తే. గలిగి గర్వంబు దొట్టి దుఃఖంబు వడికిఁ
బెనుచు నజ్ఞానపావకేంధనము ధనము
స్వప్నలబ్ధపదార్థంబు చందమునను
దలఁచి చూడంగ వట్టిబంధనము ధనము. 28

ఉ. చక్కెర పూఁతపూసినవిషంబులు కోమలవాక్య
వైఖరు, ల్పక్కఁగ వెన్నమెత్తనిశిలల్ప్రోదిబోఁడుల
చిత్తము ల్మణు, ల్చొక్కనసంకెలల్సతుల చేష్టలు
కొమ్మల నమ్మవచ్చునే, యక్కట! మోకవన్నిపులు
లంగన లన్నిఁట నెన్ని చూచినన్. 29

క. చన్నులు మాంసపుముద్దలు
గన్నులు దుర్జలముఁ బుసులుఁగా తెడిలో ఆటల్
వెన్నులు నెముకలపాఁతర
కన్నుల నిటు తెలిసి వలచు టవివేకమెగా. 30

తే. మూత్రపతనస్థలంబపవిత్రనముచుఁ
ప్రొక్కరానేలనని రోసి తొలఁగుచుండు
రట్టిమూత్రపుఁ గాలువ యైనదాని
యోని దానికి రోయ దీయుల్ల మహహా! 31

చ. కొమకులుగల్గుదాఁక నొకకొన్నిదినంబులు చింత
నంవను, లొవ్వదమిన నాయువృద్ధలము బుద్ధియు

విద్యయుఁ జాలఁగల్గఁగా, నుదుగనిచింతకల్గి తను
నోలిభజింపనిచింత తంత్రి కెవ్వను గదుఁజింత
సేయుదుకు పుత్రులు శత్రులుగాక ఖిత్రులే. 32

వ. మునీంద్రా! పుత్రదారధనాదిసంగరహితులై విష
యసుఖంబులు పరిత్యజించి యరణ్యగిరిగుహాం
తరప్రముఖవివిక్తదేశంబులం గందమూలఫలంబు
లాహారంబులు సేయుచు మోక్షసామ్రాజ్యప
ట్టాభిషిక్తు లగుమహానుభావుల జీవనంబు పావనం
బని తోఁచుచున్నయది. రాగద్వేషమూలంబైన
యీతుచ్ఛసామ్రాజ్యం బెంత ప్రాజ్యంబు సాక్షా
ద్భామత్యాగిమాత్రంబున నవిద్యాముగ్ధుల ము
యిన మావంటివారలను సంసారసాగరంబు
తరింపుచుపాయం బెట్టులగు నానతిమ్మని మో
హావేశుఁ బ్రార్థించినఁ బార్థివోత్తమువాక్యంబు
లాకర్ణించి వార్ధకోత్కర్షమానసుండయి నీప్రశ్నం
బింత యొప్పునే యిట్టివైరాగ్యంబు బహుజన్మ
సుకృతసంచితసత్ప్రభావంబున లవఁగాక సంభ
వించునే యని వికసితవదనారవిందుండయి యత్త
పోధనసత్తముండు నృపోత్తమున కిట్లనియె. 33

-- శాంతరసప్రకరణము --

తే. అవిగిలెవి వేదశాస్త్రసారాంశ మయిన
యట్టిపరమరహస్యంబు నవనినాథ

యడుగుడురుగాని ధర్మకామార్థఫణితు
లడుగరెవ్వరు నీభంగి నాత్మవిద్య. 34

శా. అజ్ఞానంబునఁ దోఁచు సంసరణదుఃఖావాప్తి
యజ్ఞానమా,త్మజ్ఞానంబున నాశనంబగుఁ దదాత్మ
జ్ఞాన మయ్యార్యశివ్యరా,నుజ్ఞంగాని ఘటింప దీశ్వ
రుఁడు సంతోషించు వేదోక్తమా, ప్రాజ్ఞ
స్వర్థిలు ధర్మమున్నదిఁ డక్రైసేయు సద్వృ
త్తిలా. 35

ఉ. కావున లోకమందు గతకల్మషులై న మముక్షుఁ
డయ్యెవి, ద న్వరణంబువాసి సముదంచితబోధ
ము నొందు బోధలీ, లావిభవంబుచేత సకలం
బును బ్రహ్మముగా నెఱుంగుఁ ద, ద్భావన నిశ్చ
లంబయిన బ్రహ్మము గాఁగ నిర్వికల్పతం. 36

వ. నరేంద్రా! యద్వితీయంబును నపరిచ్ఛిన్నంబును
నాద్యంతరహితంబును సచ్చిదానందస్వరూపం
బునునయి శోభనైగన్యంబయిన బ్రహ్మంబొక్కటి
యె వెలుంగుచుండు. అట్టి బ్రహ్మంబునందునధ్య
స్తయయు, మిథ్యాభూతయును, తచ్ఛక్తియయు,
త్రిగుణాత్మికయును,అనిర్వచనీయయునునగుచుఁ గం
దోఁచు మూలప్రకృతియనస్థనయ్యనుద దాశ్ర
యనిర్వికల్పయగ్వబలంబునం జేసి వస్తువుంబోలి

ప్రకాశించుచు నాత్మసత్తాస్ఫూర్తులవలన స్ఫుర ద్రూపంబయియావరణవిక్షేపరూపంబులుదాల్చి యుండు. అట్టిప్రకృతి సాత్వికగుణప్రకాశంబుల వలన మాయయనంబడు. అమ్మాయయందుఁబ్రతి ఫలితంబగు చైతన్యంబును మాయాధిష్ఠానచైత న్యంబును నమ్మాయయుంగూడి కారణోపాధికుం డయిన యీశ్వరుండయి సర్వజ్ఞత్వసర్వరక్షకత్వ సర్వనియంతృత్వసర్వేశ్వరత్వాదిధర్మంబులుగలిగి యుండు. అయ్యీశ్వరుండుతమోగుణప్రకాశిని యగుమాయనిఘంటించం దత్సంకల్పవశంబున శు క్తియందు రజతాధ్యారోపంబును రజ్జువందు స ర్పాధ్యారోపంబును, స్థాణువందుఁబురుషాధ్యా రోపంబునుదోఁచుకైవడి భ్రాంతికల్పితంబులయి మహాదహంకారంబులును శబ్దస్పర్శరూపరసగం ధసమేతంబులయి త్రిగుణాత్మకంబులయిగగనపవ నాగ్నిజలభూతత్త్వంబులునుక్రమంబునసంభవిం చినవి సూక్ష్మభూతంబులనంబడు. ఆభూతంబులు పంచీకృతంబులయి యన్యోన్యభాగమేళనంబున స్థూలభూతంబు లయ్యె. అస్థూలభూతంబులవలన స్థూలశరీరంబును,సూక్ష్మభూతంబుల వలన సూక్ష్మ శరీరంబును, మాయవలనం గారణశరీరంబును నయ్యె నిట్లు సమష్ట్యుపాధియైన యీత్రయంబు

వలన నీశ్వరుండు క్రమంబున విరాట్టును హిరణ్య
గర్భుండును, నవ్యాకృతుండును ననుసంజ్ఞల
నొప్పుచు నవాంతరసృష్టిస్థితిప్రళయనిమిత్తంబున
రజస్సత్వతమోగుణావలంబనంబును బ్రహ్మవిష్ణురు
ద్రరూపంబులం గ్రీడించుచుండు నిది సమష్ట్యుపా
ధికుం డయినయీశ్వరుని ప్రకారంబు ఇంక వ్య
ష్ట్యుపాధికుండయిన జీవుని ప్రకారంబు వినుము.
ప్రకృతిరజస్సత్వతమోగుణప్రధానంబువలన నవి
ద్యయనంబడు నయ్యవిద్యారూపంబు నయంతః
కరణంబునందుఁ బ్రతిఫలితంబయి నచ్చైతన్యంబును
నంతఃకరణాధిష్ఠానచైతన్యంబును నయ్యంతఃకర
ణంబునుం గూడి జీవుండను సంజ్ఞగలిగి యవి
ద్యావశతం గార్యోపాధికుండయి స్వరూపవిస్మృ
తిపొందికించిజ్ఞుండయి యుండునట్టి జీవునకు స్థూల
భూతజన్యంబయి స్థూలశరీరంబును, సూక్ష్మభూత
జన్యంబై జ్ఞానేంద్రియ కర్మేంద్రియ పంచప్రాణ
మనోబుద్ధిరూపంబయిన సూక్ష్మదేహంబును, నవి
ద్యారూపంబయిన కారణదేహంబునుం గలిగి
యుండు. అందు విశ్వతైజసప్రాజ్ఞులను సంజ్ఞల
జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలయందు స్థూలప్రవి
క్తానందభోగంబు లనుభవించుచు జీవుం డహం
కారయుక్తుండయి కర్తృత్వభోక్తృత్వాదిధర్మం

బులు తనయందు నారోపించుకొను నయ్యవివే
కంబువలన నభిమానంబును, నభిమానంబువలన
రాగద్వేషాదులును, రాగద్వేషాదులవలనఁ గర్మం
బులును, గర్మంబులవలన దేహంబును, దేహంబు
వలన సుఖదుఃఖంబులును బ్రాప్తంబులగుచుండు.
ఇట్లు పారంబులేని సంసారపారావారంబు కడ
గానక భ్రమించుచుండు. అందు నొకానొక
పురుషుండు పూర్వకృతసుకృతవిశేషంబునబహుజ
న్మంబులలో నొక్కెంట సంసారనివర్తనంబునకు
నుద్యోగి యగుచున్నవాఁడు సత్సంగతివలన సన్మా
ర్గవర్తియై పాపంబులం బాసి జ్ఞాననిష్ఠుం డగు.
జ్ఞాననిష్ఠవలనఁ జీవాత్మవ్యతిరిక్తంబయిన వస్తు
వెద్దియుం గలుగదనియును గలిగినట్లుతోఁచు
చున్న సకలజగంబును నెండమావులు జలంబు
లయి తోఁచిన క్రైవడి మనోనిభ్రాంతికల్పితంబు
లనియుం దెలిసి కార్యకారణోపాధులు మిథ్య
యగుటం జేసి యీశ్వరత్వజీవత్వంబు లసత్యం
బని ఘటపటోపాధ్యభావంబునం దదంతర్గతా
కాశంబును మహాకాశంబును నేకంబయిన యట్ల
నుపూర్వకంబయిన యాత్మయొక్కటియను నిశ్చ
యంబున బ్రహ్మైక్యానుభవంబునం దన్మయుండై
యుండు. అతండు జీవన్ముక్తుండయి పాపబద్ధయా

నంతరంబున విదేహకైవల్యప్రాప్తం దగునని
వెండియు నిట్లనిరి. 37

శా. నామంబుల్ మతి రూపముల్ క్రియలు నానార్థం
గులం దోఁచుని, భ్రామోహంబున స్వప్నము
వ్వలె నవిద్యంజేసి సత్యంబుగా, దేమిఁగ జ్ఞానికిఁ
దోఁచినట్లయిన బ్రహ్మాభూతమై యుండునో, భూ
మీశోత్తను చిన్మయంబు సకలంబు న్వేఱులే
దింతయుఁగ. 38

క. చిత్తనిరోధము సాగరముఁ
జిత్తంబను వాయువశత సృష్టితరంగో
త్పత్తియగు చిత్తమడఁగిన
నత్తఱి జగమడఁగు ముక్తియన నదియుకదా. 39

క. ఏలా పలుచదువులు బ్ర
హ్మలోకపసుఖము తనకు ననుభవమగునా
కేలెఱుఁగట మేలెఱుఁగట
భూలోకసురేంద్ర సూక్ష్మబుద్ధిం గనుమా. 40

క. అరూపుఁడు ముక్తిపగా
గ్రారూఢుండారురుక్షుఁ డారోహణగా
ర్యారంభకరుఁడు గావున
నారెంటికిఁగలదె భేద మధికారములన్. 41

తే. కాని కర్తయుఁగాక సత్కర్మములు శి
వార్పణంబులు సేయుచు నారురుక్షుఁ

దరయ నారూఢుఁడగును గాలాంతరమున
నతని కెద్దియుఁ గర్తవ్య మపుడు లేదు. 42

ఉ. మాటలు వేయునేల యొకమర్మము సెప్పెద
మోక్షదాతలై, పాటిలువిష్ణుశంకరులభక్తిదృఢం
బుగఁగల్గెనేని నా, నాఁటికి వానికన్నిసుగుణమ్ములు
దాపె ఘటింప ముక్తుఁడౌ, బూటకపున్విచార
ములఁ బోవఁగ నేమిఫలంబు భూవరా 43

క. సగుణం బెటులఁగి భజించిన
నగు నిర్గుణసిద్ధి సిద్ధుఁ డగువానికిఁ
జగమెల్లను బ్రహ్మమయం
బుగఁ దోఁచును సర్వకాలమును నొక్కగతిఁ.

సీ. బయలసంరంభి లోపల నసంరంభియై
కార్యతంత్రంబులు గడపెనేని
సఫలప్రయత్నంబు విఫలప్రయత్నంబుఁ
దనకుఁ దుల్యంబుగాఁ దలఁచెనేని
ననివార్యమై కర్మమునవచ్చు సుఖము వ
ర్జించినయట్ల భోగించెనేని
సౌఖ్యంబు దుఃఖంబు సంప్రాప్తమైనపో
నుబ్బుసుస్రుక్కులు లేక యుండెనేని

తే. శివశంకర మీశ్వరైక్యసద్వృత్తునుభాను
భూతినిష్పంక యాత్ముఁడై పాలిచెనేని

నతఁడు ప్రారబ్ధమున వ్యవహారియైన
ముక్తిసామ్రాజ్యపట్టాభిషిక్తుఁ డగును. 45

చ. వనమున నున్న నేమి గృహవాసము చేసిన నేమి
యాత్మభా, వనయు నసంగవృత్తి యరివర్గజయం
బును గల్గియుండినన్, వనమున నున్న నేమి గృహ
వాసము జేసిన నేమియాత్మభా,వనయునసంగవృత్తి
యరివర్గజయంబులు లేకయుండినన్. 46

క. దేహము దాఁ గానని నిజ
మూహింపఁగ నెవ్వనికి యుక్తమునకుఁ ద
ద్దేహమున కయినబాంధవ
దేహంబులు మిథ్య లనుచుఁ దెలియంబడవే. 47

సీ. పుత్రమిత్రకళత్రమైత్రివర్జితుఁడైన
శుకసంయమి బ్రహ్మనిష్ఠ వినమె
కర్మఠుఁడయి రాజధర్మమూనిచరించు
జనకునివిజ్ఞానచర్య వినమె
వాణిజ్యవృత్తిజీవనుఁ డైనతులా
ధారునిపూర్ణబోధంబు వినమె
కటికిగాయకముచేఁ గాలంబుగడపుధ
ర్మవ్యాధువిజ్ఞానరూఢి వినమె
తే. వారిప్రారబ్ధమున నుండవలసి జ్ఞాను
లెట్టివ్యవహారములనున్న నేమికొదవ

జ్ఞానవైరాగ్యనిశ్చలానందపూర్ణు
లయినవారు జీవన్ముక్తు లగుట నిజము. 48

క. ఏయాశ్రమముననుండిన
నాయాచారములు నడప కాశ్రమసుఖత్వ
స్థాయ త్తమతిని వంచకుఁ
డై యేనిష్కర్మినను టనర్థముగాదే. 49

ఉ. కర్మము బంధకం బని సుకర్మము మాని సుఖంబు
గోరి దుష్కర్మము సేయుచున్నసులు గాదనిన
న్వివకాత్మకున్న వే, కర్మములంచుఁ గాంచెదుటఁ
గా. కొంకొందఱ జ్ఞానినిపుణుం, గర్మఫలాప్తికిం
జెరుచు గాపురుషుం డిటదేష్ట నంచు నిష్కర్మికి
నాస్థలేదుభయకర్మములు న్విధిచే ఘటించినన్.

మ. జ్ఞానారూఢుఁడు బాహ్యచేష్టల మనస్సంకల్పుఁ
డై చేయుచో, నెమ్మంత్రాస్త్రతువట్లవానిఁగనితానా
చేష్టలే చేయఁగాఁ, బోనల్పజ్ఞుఁడు వంచనమ్మదిఁ
దలంపు ల్జ్ఞానకారూఢుఁడు, స్నేనంచుఁగా ఫల
మేమి చేష్టలమదిన్నిశ్చింత లేకుండినన్. 51

ఆ. మనసు చల్లఁబడక మాటలెన్నాడిన
ముక్తిగాదు వాదశక్తిగాని
మనసె కారణంబు మఱి బంధమునకు మో
క్షమున కనుచుఁ దెలుపుచదువు వినమె. 52

క. జ్ఞాతృజ్ఞానజ్ఞేయము
లేతెఱఁగున వేఱుదోఁప కేకంబుగన
ద్వైతాత్మత వెలుఁగు ప్రపం
చాతీతుం డెవ్వఁ డతఁడె యారూఢుఁడిలన్. 53

క. ఇది నగర మిది యరణ్యం
బిది సౌఖ్యం బిది యసౌఖ్య మీతఁడు పురుషుం
డిది సతి యని తోఁపదు యే
య్యది మాచిన బ్రహ్మమయము యారూఢునకున్.

తే. సంగములు సర్వమును గల్గి సంగి గాఁడు
భోగములు సర్వమును జెంది భోక్త గాఁడు
కార్యములు సర్వమును జేసి కర్త గాఁడు
విగతసంకల్పుఁ డగు బ్రహ్మవేత్త యధిప. 55

ఆ. ఇచ్ఛ లేని యోగి కింద్రియంబులు కర్మ
వశత చే స్వభావవర్తనముల
మెలఁగుచున్న నేమి యిలఁ బుణ్యపాపంబు
లంట వతఁ డకర్త యగుటఁ జేసి. 56

తే. నిర్విషయచిత్తుఁ డగు బ్రహ్మనిష్ఠునకును
దనుసుఖంబులు ప్రారబ్ధమున ఘటించు
నంతియే కాని యవి వాని నంటుకొండుఁ
గమలపత్రాగ్రమున జలకణికవోలె. 57

తే. శయ్యనుండియుఁ బెక్కు దేశముల వెంటఁ
దిరుగఁ గలఁగాంచుచున్న నిద్రితుని భంగి
సచ్చిదానందుఁడయ్యుఁదా జననమరణ
బాధలనుబొందినట్లుంట భ్రాంతిగాదె. 58

క. కలలోన వఱుకులాడినఁ
గలవే గాయములు మేలుకాంచిన వెనుకం
దెలియక మునుపటిసంస్మృతి
కలకలు విజ్ఞానికేల గలుగం దోఁచున్. 59

క. ఆయొఱుక దొరకుకొఱకుఁగ
దా యోగజపాదినిష్ఠలా యొఱుక దృఢం
బై యున్నతఁ డే క్రియలం
జేయఁడు లోకోపకృతికిఁ జేసినఁ జేయున్. 60

మ. తొలిజన్మంబులనైన నిష్ఫుడయినన్ దుష్కర్మని
ర్మూలనం, బిల బ్రహ్మోర్ఫణపత్క్రియామహిమచే
నెంతే ధృతింజేసి నిష్కలుఁ డైనన్ శ్రవణంబు
తన్మననము ద్రాపన్నిధి ధ్యాసలున్, సులభంబౌ
శ్రవణాదులబ్బక చలించుం దామసత్యాగతన్.

క. ఈ మేనను సత్కర్మము
లేమియుఁ జేయకయె చెందు నిద్ధజ్ఞానం
బామునుపటిభవమున ని
ష్కామసుకర్మాప్తి విగతకల్మషుఁ డయినన్. 62

ఉ. చేయఁడుసత్క్రియల్బయలఁ జేసినయట్లసుఖించు
లోపలం, జేయును గార్యముల్ బయలఁ జేయని
యట్ల సుఖించు లోపలం, జేయఁడు కృత్య
మంచు మఱిఁ జేసెడు గృత్య మటంచు నెంచరా,
దేయెడ బ్రహ్మవిద్య కుదరెక్కినయట్టి మహాను
భావునిన్. 63

చ. అమితముగాఁ ఘటించు విషయానుభవంబుల
భోగియయ్యు ను. త్తముఁడగు యోగిబ్రహ్మ
మయుతన్మది రంజిలుచుండు గీతనృ, త్యములను
దాళమానవతుఁ డయ్యు శిరస్థితపూర్ణకుంభ
ముగా, వసుధిక యు త్రిప్పిరానఁ జాలిననాట్యధు
రీణు కైవడిన్. 64

తే. తలఁచినఁ దలంపకున్న నిత్యప్రబోధ
పూర్ణుఁడగు జ్ఞాను దాఁ గానఁబోవు బట్టు
తెలుఁగఁదగుగుణి తినకంటె నద్దిలేక
యెఱుక మఱపులు సదమైన యెఱుక యెఱుక.

వ. అనిపలికి వెండియు నిట్లనియె. 66

ఉ. కోరకు మేఁదర్థమును గోరిన వచ్చునె రానివ
స్తువుల్, కోరకయున్న గాదె తనకర్మ లభించం
బగ నున్నయర్థముల్, గోరిన గానిచోఁ గలిగి
కోల్పడుచో వెతగాన సజ్జనుల్, కోరరనాప్త
ప్రాప్తములఁ గొందురు కుందరు వస్తుహానికిన్.